# బ్రిహజ్జ్ఞానము

కలకత్తా బ్రహ్మసమాజమువారి

హిందూశాస్త్రమహాసభవారి

మహారాజశ్రీ శ్రీమహారాజా

సర్ శ్రీ గోడేనారాయణగజపతి రాయనింగారి

కే. సీ. ఐ. ఈ. వారి అనుజ్ఞాప్రకారము

శ్రీమాన్ శ్రీమహామహోపాధ్యాయ

శ్రీపరవస్తు వేంకటరంగాచార్యులయ్యవారలుంగారు

అనేకోపనిషత్తులనుండియు ధర్మశాస్త్రములనుండియు

ఎత్తివ్రాసిన శ్లోకములకు తర్జుమా.

పద్యరూపముగా నెల్లరకు సులభముగా దెలియునట్టుల

లాంగలనదీతీరస్థ బొంతలకోడూరు నిలయుడును

శ్రీహరి రామకృష్ణసూరిపుత్రుడును అగు

రామమూర్తి కవిచే

రచియింపబడి, అబ్జర్వేటరి ప్రెస్సులో ముద్రింపబడెను.

1915.

| | [illegible]ములు. | | శ్లోకముల అర్థములు. | | |
|---|---|---|---|---|---|
| | | | ఆరంభము | అంతము | మొత్తము శ్లోకములు |
| [illegible] | [illegible]డకోపనిషత్. | ... | 1 | 6 | 6 |
| [illegible] | ఈశోపనిషత్. | ... | 7 | 9 | 3 |
| [illegible] | తలవకారోపనిషత్. | ... | 10 | 13 | 4 |
| 4 | కఠోపనిషత్. | ... | 14 | 21 | 8 |
| 5 | శ్వేతాశ్వతరోపనిషత్. | ... | 22 | 26 | 5 |
| 6 | బృహదారణ్యకోపనిషత్. | ... | 27 | 28 | 2 |
| 7 | మహాభారతము. | ... | 29 | 43 | 15 |
| 8 | మహానిర్వాణతంత్రమ్. | ... | 44 | 53 | 10 |
| 9 | శ్రీమద్భాగవతము. | ... | 54 | 56 | 3 |
| 10 | మనుధర్మశాస్త్రము. | ... | 57 | 65 | 9 |
| 11 | యోగవాశిష్ఠము. | ... | 66 | 70 | 5 |
| 12 | ఇతరగ్రంథములు. | ... | 71 | 80 | 10 |
| | | | | | 80 |

ఛత్రపురము.
5-3-1912.

బుధవిధేయుడు.
బెహరా రామమూర్తి.



శ్రీరస్తు.

# బ్రహ్మజ్ఞానదీపిక.

తే॥గీ॥ ఏమహావిద్యచే నీశు డెరుగబడునొ।
యదియె శ్రేష్ఠంబటంచును ననగవలదె।
వేదములుశిక్షకల్పంబు వేనవేలు।
విద్యలవియెల్ల కొరగాని విద్యలనఁగ॥ ౧॥

సీ॥ ఎంచగానెయ్యది యెలమిజ్ఞానేంద్రియ।
ములకునవిషయమై వెలుగుచుండు।
కర్మేంద్రియంబుల గ్రహణంబెరుంగదో।
యాదిమూలములేక యలరుచుండు।
శ్రోత్రనేత్రంబులు సూటిగాలేనిది।
హస్తపాదంబులు నరయజన్మ।
నాశముల్లేనిది వాశిప్రదేశని।
బంధనలేనిది బరగిసకల।

ఆ॥గీ॥ మననుగల్గిసూక్ష్మమును హ్రాసమునులేక।
సర్వభూతములకు సరగకార
ణంబునైనయట్టి యాపరబ్రహ్మము।
జగతినిండుచుండు చతురగుణుఁడు॥ ౨॥

తే॥గీ॥ ఈపరబ్రహ్మమునబ్రాణ మింకమనసు।
నింద్రియంబులు భూమియు నిరవుజేసి।
పంచభూతంబులనెడి ప్రపంచమిందు।
గల్గెననిబల్కుచుందురుగాదె ఘనులుదెలియ॥ ౩॥

తే॥గీ॥ అఖిలభూతంబులంగూడి యలరువాఁడు।
వాఁడెపరమాత్మయనిమెచ్చు వారెఘనులు।
క్రీడఁజేర్చియుపరమాత్మ జాడనిల్పి।
కర్మశీలురునగువారు ఘనులుసుండి॥ ౪॥

కం॥ సత్యమెజయమగు ధరణిన।
సత్యంబపజయమటంచు చాటనెశ్రుతులున్।
నిత్యంబైనదిసత్యము।
సత్యమెదుర్దశలకెల్ల స్థానముసుండీ॥ ౫॥

కం॥ కన్నుల నఖిలేంద్రియములు।
జన్నములంజపమునలన చాలరెరుగగా।

నెన్నగబరమాత్మునమరి।
పన్నగపరిశుద్ధచిత్త పదవినిదక్కన్॥ ౬॥

క॥ ధరగల్గువస్తుజాలము।
పరమేశ్వరుచే జనింపబడెగావునని।
ధ్ధరవిషయాసక్తినిబో।
దరుముచు నానందపదవి దగనొందవలెన్॥ ౭

తే॥గీ॥ మొదలుచూడదు మొదలుసమీపమునను।
దూరమున పైనిలోపల దొలగకుండ।
నన్నిటనునిండియాయాత్మ యున్నదనుచు।
దెలియువారలుధీరులు దివ్యగుణులు॥ ౮॥

సీ॥ అవయవహీనుండు నరయనకాయుండు।
స్నాయుహీనుడుపాపనాశనుండు।
నిర్మలుండునుసర్వని యతిగోచరుడును।
మనసుననియమించి మనువువాడు।
ఆత్మపరిశుద్ధుడనయముస్వప్రకా।
శుడు వస్తుజాలముసొంపుమీర।
నిర్మించియున్నిటనెనయబై వాడయి।
వ్యాపకుండగుచు సర్వముననిండు॥

తే॥గీ॥ నట్టిపరమాత్మునే ధీరుడరశిగనునొ।
వాడెపుణ్యుడు ఘనుడును వాడెగుణుడు।
వాడెచతురుడు వేదాంతివాడెధర్మ్యు।
డనుచు పెద్దలుదెలుపంగ వినమెజగతి॥ ౯॥

కం॥ వాక్కున నెయ్యది వెల్గదొ।
వాక్కునునది దేనివలన।
వరలుచునుండున్।
నిక్కముగనదియె బ్రహ్మము।
తక్కినలోకులుపశించు।
తపములుం నెపముల్॥ ౧౦॥

తే॥గీ॥ ఇంచుకయు దేనిమనసుచే నెరుగడెవ్వ।
డెప్పుడును దేనిచే మనస్సెరుగబడునొ।
యద్ది బ్రహ్మంబటంచును నసగవలయు।
గానిలోకులు గన్నదిగాదుసుండి॥ ౧౧॥

కం॥ ఎరుగుదు నెరుగను బ్రహ్మం।
బరుదుగనని దెల్పజాల।
నరయగ బ్రహ్మం।
బెరుగను నెరుగుదుననునీ।

వరవాక్యరహస్యముం దె।
వర్తిలుచుండుఙ॥ ౧౨॥

కం॥ మము బ్రహ్మంబునిరాకర।
ణముచేయకనుండుగాత।
నయమున నెపుడుఙ।
తమిమీర పరబ్రహ్మము।
క్రమమునను వశింపగడగు।
కతముననుభువిఙ॥ ౧౩॥

తే॥గీ॥ క్షుత్పిపాసలు లేకయుశోకనాశ।
మగుచుజావుపుట్టులు లేకయచ్చముగను।
నుండుస్వర్గంబు నానందమండలంబు।
పాడుమృత్యువయచటనీభయమదేల॥ ౧౪॥

తే॥గీ॥ ప్రియహితద్వితయము సంభవించునపుడు।
ధీరుడగువాడు హితమును దీసికొనుచు।
మందబుద్ధి ప్రియంబును మదినిగోరు।
క్షేమలాభంబులనుగోరు చనటియగుట॥ ౧౫॥

తే॥గీ॥ వేదపారాయణంబున లేదుబహువి।
ద్యార్థధారణశక్తిని నరయలేదు॥

శ్రవణమున లేదు పరమాత్మ భువిని దెలియ।
నాత్మరూపంబుగనువాడె యాత్మ దెలియు॥ ౧౬॥

తే॥గీ॥ ఎవడు దుష్కర్మమునుడుగ డింద్రియముల।
చలనశాంతిని జెందడి య్యిలను చిత్త।
సుస్థిరత లేక కోరిక సొలసి శాంతి।
నొందడవ్వాడు పరమాత్మ జందలేడు॥ ౧౭॥

తే॥గీ॥ వెలయనజ్ఞానమను నిద్ర దొలగ ద్రోచి।
జ్ఞానమును తెల్వి లోనార్య జనుల జేరి।
యంటరానట్టిక్షురధార యట్టితీక్ష్ణ।
మైనపరమాత్మగన్గొని మనుడు ధరణి॥ ౧౮॥

తే॥గీ॥ ధీరులమృతులగుచు సంసారమందు।
నిత్యవస్తువుగోరరు నెమ్మితోడ।
నల్పబుద్ధులు విషయమం దాసగల్గి।
శ్రమముపడుదురు మృత్యుపాశమునజిక్కి॥ ౧౯॥

తే॥గీ॥ ధరణిజీవులు నిద్రించు తరుణమందు।
నూరకుండక సకల ప్రయోజనోప।
యుక్తసామగ్రినిర్మాణ శక్తుడగుచు।
నలరునాతని బ్రహ్మంబు నమృతుడంద్రు॥ ౨౦॥

సీ॥ ప్రాణస్వరూపమా పరమాత్మతగనధి।
స్థానంబుగానుండ జగముదోచె।
నదికువిశాయుధంబని భయకంపితు।
లగువారలందు దురమృతపదవి।
భయహేతువుననగ్ని ప్రజ్వరిల్లుచునుండు।
భయమునసూర్యుండు ప్రభలనొసగు।
జలదముల్ భయమున జలమునొసంగును।
భయమునవాయువు బరగుచుండు।
గీ॥ భయమునను మృత్యుదేవత బారుచుండు।
వానినేత్రింబులనుమనో వాక్యములను।
గననశక్యంబు బ్రహ్మంబు గలదటంచు।
నెరుకగలవారలకుదక్క నొరులకగునె॥ ౧౦॥
ఆ॥గీ॥ సర్వమునకునేత స్వప్రకాశుడనంతు।
డమలుడీశుడనగ నలరుచతడు।
శాంతినిచ్చుకొరకు సదమలధర్మంబు।
నడపువాడునేత పుడమిలోన॥ ౧౧॥
కం॥ సర్వాత్మగుణాభాసుడు।
సర్వేంద్రియవర్జితుండు సర్వేశ్వరుడు।

సర్వేశ్వరుండ్యుతుదలపగ।
సర్వముపరమాత్మయనుచు।
చాటగవలయు॥ ౨౩॥

తే॥గీ॥ పాణిపాదంబులునులేక పట్టునడచు।
వీనులును నేత్రములులేక వినునుజూచు।
నతడుసర్వజ్ఞుడాతని నరయరెవ్వ।
రాతడాదిమపూరుషుం డనగవలదె॥ ౨౪॥

తే॥గీ॥ అద్వితీయుండునై వర్ణమదియులేక।
బహువిధంబులశక్తులు ప్రజలకొరకు।
జేసియునుజగదాద్యంత వాసియగుచు।
నుండుదేవుడుశుభముల నొసగుగాత॥ ౨౫॥

తే॥గీ॥ ఈశులకునెల్లబరమేశు చింక దేవ।
వరులలోనెల్ల పరమదైవంబుసుండు।
పతులకెల్లను పతిమాకు బ్రాపెవండొ।
వానిధ్యానించి పాపముల్ బాపుకొనరె॥ ౨౬

ఆ॥గీ॥ సుతునికంటె పేర్మి చూడగానెయ్యది।
ధనముకంటె పేర్మి ధరణినెద్ది।
సర్వమునకులోన సంధించెనెయ్యది।

యదియెయాత్మయగుట నరయవలయు॥ ౧౭॥

సీ॥ ధనముచేనిండినధరణినాదైనను।
నాశ మొందక యుంచనాతరంబె।
ధనముచేనమృతత్వమనునది కాబోదు।
గలనిదానికి కాంక్ష లేల।
సత్యహీనుడననుసత్యునిగాజేయు।
వెలుగిచ్చిచీకటి వెడలజేయు।
వడిమిత్తివాతనుబడిపొలియకనుండ।
నమృతత్వము నొసంగియమరబ్రోవు।

గీ॥ పరమపూరుష దేవశుభప్రభావ।
ఆదిమధ్యాంతరహితుడవైననిన్ను।
కోరిభజియింతు బ్రోవవేకూర్మితోడ।
సత్యమునుదెల్పియు నొసంగిశాశ్వతంబు॥ ౧౮॥

కం॥ తనుఛేదింపగవచ్చిన।
జనునకునీడనిడుతరువు చందంబునభూ।
జనసదనమునకుశత్రులు।
జనగానాతిథ్యమురయ జరుపగవలయున్॥ ౧౯॥

కం॥ సత్యజ్ఞానము హితమగు।

సత్యము శ్రేయస్కరంబు సత్యవ్రతముగ।
నిత్యముపక్షమవ్రతమది।
ఆత్మజ్ఞానంబుపరమ మగునన్నింటగ॥ ౩౦॥

తే॥గీ॥ ఏదిమేలనితలోచునో యెలమినందె।
తనదుయాత్మని మోగింప దగునునుండి।
పాపకృత్యంబు జేసిన వానికిప్రీతి।
పాపమును శేయమియుసాధువగుట మేలు ॥౩౧॥

సీ॥ అలసినవానికి నాసనంబిడుటయు।
శయనంబురోగికి సరగనిడుట।
ఆకలిగొనువానికన్నంబునొసగుట।
దప్పిగలానికి తత్క్షణంబు।
జలమొసంగుటయునుజరుపగవలయును।
వాక్క్రియామనములవలన పాప।
ములనుగావించరోముఖ్యముగానట్టి।
వారెతపస్వులు వారెకృతులు।
గీ॥ గానియడవులదిర్మ్మరి గాలినెండ।
గరముబాధలబడుచును గాయశోష।
ణమునొనర్చినమాత్రాన నమలతపము।

గాదటంచునుభారతకథలవినరె॥ 3౨॥

తే॥గీ॥ మూఢజనమైత్రి మోహంబుమూడజేయు।
సజ్జనులమైత్రిధర్మంబు సంగ్రహించు।
ధనమునన్యాయముగదెచ్చి దానధర్మ।
ములనుజేసినపాపముల్ దొలగలేవు॥ 33॥

తే॥గీ॥ ప్రాజ్ఞుడగువాడులోకుల పల్కులువిని।
హితములగువాక్యములదనమతినినిల్పు।
నీరముననుండుక్షీరంబు నేర్పుతోడ।
సంగ్రహించుమరాళంబు సరణిజగతి॥ 3౪॥

క॥ సత్యమునరియగు ధర్మము।
సత్యంబునకంటెగొప్ప సరకిలగలదే।
సత్యవిహీనతకంటెన।
నిత్యంబాకూరవస్తు నిచయముగలదే॥ 3౫॥

క॥ జలనిధికియానపాత్రియు।
వలెమోక్షుడమానవంత పదవికిసత్యం।
బిలనొకటియెసోపానము।
సలలితముగనొండులేదు చర్చింపంగ॥ 3౬॥

ఆ॥గీ॥ సత్యమునజయింపు సరగమోసంబున।

క్రోధముననుగెల్వు క్రోధచయము।
సాధుమార్గముసన సాధులనుపకార।
మునను గెల్వుతుందరి జనులనిలను॥ 32॥

తే॥గీ॥ తాల్మిదోషంబునెన్నదు తగుధనంబు।
భువిని శక్తులకును గుణ భూషణంబు।
శక్తికివశీకరణమగు సకలజగము।
తాల్మియనునాయుధముసర్వతంత్రహారిము॥

ఆ॥గీ॥ తనదులక్షణముల తాగనునెవ్వడు।
వాడెమునియటంచురి వసుధలోన।
మానమునుధరించి మరివనవాసియా।
వాడుమునియటంచు వలదుబల్క॥ 35॥

ఆ॥గీ॥ ముదిమియందుసుఖము। మూడునెద్దానిచే।
దానివయసునందె బూనిజేయు।
మరయజీవనంబు నంతేయుపరలోక।
సుఖముకొరకొనర్చు ప్రకటమతిని॥ 40॥

కం॥సత్యంబనునదెబ్రహ్మము।
సత్యంబనునదియె తపము సత్యమెక్రతువుగ।
సత్యమెశాస్త్రముదలపగ।

సత్యమునాశంబులేని సరకనివినరా॥ ౪౧॥

సీ॥ ధర్మము చేయంగ దగుకాల మిదియని।
నిర్ణయింపంగనేనికివశంబు।
మనుజునిరీక్షించి మానునేమృత్యువు।
నిత్యమువెంటాడి నెరయుచుండు।
సతతము ధర్మముసల్పుటయేమేలు।
సతము మృత్యువునోట జనములుంట।
ననఘులు విషయమధ్యము నందునుండియు।
నుండకచరియింతు రుర్విలోన।

గీ॥ దుర్మతుల్ విషయములను దొలగకుండ।
నుండుదురీతినివిహరించి యుండలేక।
దుష్టవిషయంబులంబడి దుష్టులగుచు।
ధరణిచరియింతురందురు తత్వవిదులు॥ ౪౨॥

తే॥గీ॥ సుఖముదుఃఖంబుపేర్మియు సూటితోడ।
నప్రియంబును బ్రాప్తించు నపుడుజనులు।
తానుభవింపనపరాజితంపుచిత్తు।
లగుచునుండుటవిధికదా యనఘులార॥ ౪౩॥

తే॥గీ॥ ఈగృహస్థాశ్రమంబున నెనయువాడు।

బ్రహ్మనిష్ఠాగరిష్ఠుడై బ్రహ్మబలితత్వ।
వేదిపరుడౌచుతా జేయువేలబనులు।
బరగనర్పణజేయును బ్రహ్మమునకు॥ ౪౪॥

కం॥ దురమందెవ్వడు బెదరడొ।
దురమందెవ్వాడు వెనుక దోగడొ మరియున్।
ధరధర్మపుసమరంబున।
మరణించినవాడులోకమంతయు గెల్చున్॥ ౪౫॥

తే॥గీ॥ కామమునుక్రోధమేరికి గలుగువశిత।
దీనజనులందుదయగల ధీరులెవరొ।
సత్యమెవ్వరికిలలోన సద్వ్రతంబొ।
వారెలోకంబులను గెల్చు వారుసుండీ॥ ౪౬॥

కం॥ తనకీర్తి పౌరుషంబులు।
జనులకు నుపకారమొందు సల్పెడునదియున్।
జనుడెవడుబైటవేయడొ।
ఘనుడాతడె ధార్మికుండు గణుతింపంగన్॥ ౪౭॥

కం॥ ఇలలోగృహస్థుడనిశము।
తలిదండ్రులె దైవమనుచు దలపగవలయున్।
సలలితమతియైవారిని।

తలగక సేవింపవలయు తత్పరుడగుచుఁ॥ ౮౮॥

కం॥ కులపావనుడగుపుత్రుడు।
తలిదండ్రులమృదులవాక్య తతిచేదనుఁపుఁ।
జలమూనక కూరిమిబను।
లిలజేయుచునాజ్ఞలందు నేర్పడియుండుఁ ॥౮౯॥

కం॥ ధనమునవస్త్రమునను మరి।
నెనరున సంతోషపరచు నెలతననిశముఁ।
ఘనుడైన మానవుండిల।
జనడప్రియమార్గములను సతియెడదలపఁ ౯౦॥

తే॥గీ॥ ఘనపతివ్రతయగుకాంత కాంతునెడల।
క్రూరదృష్టినిజూడంగ గూడదండ్రు।
మనసులోనైననప్రియ మనగవలదు।
చెడుగుమాటలనెన్నడు నుడువతగదు ౯౧॥

ఆ॥గీ॥ కన్యకలకువిద్యగరపి యాదటధన।
రత్నవస్తుసమితి రహినొసంగి।
పండితుండునైన భవ్యుడౌవరునకు।
గన్యధారపోయు ఘనుడెజనుడు॥ ౯౨॥

కం॥ పతులయెడ మెలగురీతులు।

సతతముసెరుగుచునధర్మ శాసనవిధులున్।
సుతలకెరుకపడు వరకిల।
కుతుకముతోఁ బెండ్లిచేయ కూడదుజనకుల్ ॥౫౩॥

తే॥గీ॥ ముక్తిమార్గంబు జూపునీ భక్తివిడచి।
జ్ఞానమునుగోరుమూఢుల సరణిదలప।
ధాన్యమున్మానియుముకను దంచువారి।
పగిదిదుఃఖంబులకుపాలు బడరె దేవ॥ ౫౪॥

తే॥గీ॥ తానునొరుడనుభేదమా తలపులేక।
సర్వభూతంబులందును సమతగాంచు।
శాంతచిత్తుడునగువాడు శాశ్వతంబు।
భక్తిపరుడగు భవ్యుడా భాగవతుడు॥ ౫౫॥

ఆ॥గీ॥ అధికమైనగాని యణుమాత్రమైనను।
నేర్పుతోడజనులు నేర్చవలయు।
సకలనీతిశాస్త్ర సారంబుదలపగ।
ప్రసవరసముగ్రోలు భ్రమరరీతి॥ ౫౬॥

తే॥గీ॥ ఇంద్రియంబులలోనొక్క యింద్రియంబు।
స్ఖలనమును జెందుచోవాని తెలివియెల్ల।
భ్రంశమగునది నిక్కము భస్త్రిలోన।

తూటు గల్గిన జలమంత తొలగునట్లు॥ ౫౭॥

కం॥ పరవశము దుఃఖకారణ।
మరయంగానాత్మవశము నగుసుఖకరముల్।
ధరలో సుఖదుఃఖంబుల।
గురుతులు సంక్షేపమునకు గుణలక్షణముల్॥

తే॥గీ॥ పుట్టుటయు గిట్టుటయు నొందు పొందు లేక।
పాపపుణ్య ఫలంబుల బడయు నొందు।
మేళనం బెద్దియును లేక మెలగుచుండు,
ప్రాణియనుదాని కింకొక ప్రాపు లేదు॥ ౫౯॥

కం॥ ప్రతిదినము నిర్జనంబౌ।
క్షితియందు బ్రవేశమగుచు చింతించు నెడన్।
హితమగు కోరిక లన్నియు।
సతముగసముకూడునంద్రుసర్వజ్ఞులిలన్॥ ౬౦॥

సీ॥ ధర్మంబు తాలిమి తగ మనోనిగ్రహ।
మును చౌర్యహీనతయును శుచితయు।
నింద్రియనిగ్రహ మిద్ధవివేకము।
సదమలవిద్యయు సత్యవచన।
మాగ్రహహీనత యనియొడునీపది।

ధర్మలక్షణములై తనరుచుండు।
దానము చేయుట తక్కువమైనను।
విస్తారమైనను వినుము దాని।

గీ॥ ఫలము దానంబుగొనువానిబట్టి కలుగు।
పాత్రతాపాత్ర తలెరిగి పరగ భువిని।
దానమొసగును సత్పాత్ర తతికి నెవడు।
వానికాముష్మికంబున వచ్చుసుఖము॥ ౬౧॥

కం॥ ధర్మం బొక్కటె మిత్రము।
ధర్మము మరణంబునైన దగ నర్తించున్।
ధర్మేతరంబులన్నియు।
నిర్మలకాతనువుతోడ నిజము నశించున్॥

కం॥ ధర పాపపుణ్యముల్ గను।
పరమాత్ముడు నీదుహృదయపంజరమందున్।
నిరతంబు నిల్చియుండగ।
నరయగనేనుంటినొకడ ననుటది మేలే॥ ౬౩॥

తే॥గీ॥ అరయ పురుషులచే గృహమందు నిత్య।
మును నిరోధింపబడియుండువనిత లెందు।
రక్షితలుగావు తమయాత్మసంరక్షణంబు।

చూచుకొనువారెరక్షితల్ సుండుజగతి॥ ౬౮॥

కం॥ పాప మొనర్చెడివాడిల।
తాపముజెందన్విముక్తి దనరును మరలన్।
పాపంబు జేయనని మది।
బ్రాపింప విరాగియైన బరిశుద్ధుడగున్॥ ౬౯॥

తే॥ గీ॥ పాదపంబులు మృగములు పక్షికులము।
బ్రతుకుచున్నవి కావె యెబ్బంగినైన।
గాని యెప్పుడును మనసున గరిమతోడ।
బ్రహ్మమననంబుచేసెడు బ్రతుకె బ్రతుకు॥

కం॥ తనయనుభవము సుశాస్త్రము।
ననఘుండౌగురువువలన నగునుపదేశం।
బున నెవని కైకకర్త్యం। [గిన్॥ ౭౧॥
బుననుండునో వాడెయాత్మమును జూచునో

గీ॥ పుణ్యతీర్థవాసముననుకాయక్లేశ।
మునను నాత్మ దెలియబోలు టెట్లు।
ధర మనోజయంబు దగ గల్గువారికి।
దక్క నోరుల కగునె తలచిచూడ॥ ౭౨॥

తే॥ గీ॥ మోహామమునుడి సడలిన ముదముతోడ।

నాత్మవిదులగుసజ్జను లఖిలసమ్మ।
తముగ నుందురు తత్స్వ దగును వారు।
గారె సంసారజలనిధి గడపువారు॥ ౬౯॥

గీ॥ ఇతడు బంధుడరయనీతండు గాడని।
దెల్పుచుంద్రు క్షుద్రదీనజనులు।
ధర నుదారచిత్తధర్మచరిత్రులు।
సకలజగము బంధుజనమ యంద్రు॥ ౭౦॥

గీ॥ శూరు డిల గాడు రణమున జేరి గెల్వ।
పండితుడు గాడు విద్యచే భాసిలంగ।
వాక్పటుత్వంబుచేతను వక్త గాడు।
దానతత్పరుడగునంత దాత గాడు॥ ౭౧॥

తే॥గీ॥ శూరు డింద్రియజయమునసూవె; ధర్మ।
చరితమున పండితుండన జనును; సత్య।
వాక్యములుపల్కునాతండు వక్త యగును।
దాతయగునన్ని టనుసమదయనుజూడ॥ ౭౨॥

తే॥గీ॥ అఖిలశాస్త్రంబుల జదువునంత మర్త్య।
డఖిలసుజ్ఞానమున్న వాడగునె దీప।
శిఖప్రకాశంబుచే దెల్పు సేయు నెపుట।

వెనుక చీకటి బాపలే దెనసిచూడ॥ ౭౩॥

తే॥గీ॥ వస్తుతత్వంబు దెలియనివాఁడు భువిని।
నాస్తికునివలె నుంటయే యగునుచితము।
కాస్తజూచిన గంపంతగంటిననుచు।
వాస్తవముమీరి పల్కినవాఁడె పశువు॥ ౭౪॥

కం॥ లోకంబుల పుట్టింపను
లోకంబులు వృద్ధిజేయ లోలత లేక।
లోకంబుల గిట్టింపను।
ఆకలనముగల్గు దేవు నభినందింతున్॥ ౭౫॥

కం॥ దేవా మాయపరాధము।
లేవియు దలచిననునిల్వలే మిలలోనన్।
భావించిచూడ సర్వము।
నీవొనరించినట్టిమాయనీరధియొగదా॥ ౭౬॥

కం॥ ఇదిపాపం బిది పుణ్యం।
బిది నరకం బిదియె స్వర్గ మీగతివిబుధుల్।
ముదమునను నానతిచ్చిరి।
యదినిక్కముగనకపొందిరఘములనుజనుల్॥

ఉ॥ ఎవ్వఁడు సర్వప్రాణులను।
నేమరకన్ సృజియించె ధీరుఁడై।
ఎవ్వఁడు ప్రాణికోట్ల కిల।
నేర్పడ వృద్ధి దనర్చె శూరుఁడై।
ఎవ్వఁ డనంతసృష్టిని ని।
జేచ్ఛ లయంబొనరించె క్రూరుఁడై।
ఎవ్వఁడనంతుఁ డవ్యయుఁడో।
యేను నుతింతును వాని వేడ్కతో॥ ౭౦॥

తే॥గీ॥ శాశ్వతం బెద్ది? భువి గల్గుసకలమును న।
శాశ్వతంబంచు నందరుజాటఁగ విని।
విశ్వమనుమాయలోఁ జిక్కి వెతలబడుచు।
శాశ్వతపదవి గన్గొనజాల రకట॥ ౭౧॥

సీ॥ సుగుణసౌందర్యముల్ తగ గల్గుకులసతి।
త్యాగభోగములకు తగినధనము।
సరసమౌకవితకు చాలినవిద్యయు।
మాలిన్యహీనమౌ మానసంబు।
మహిలోన సజ్జనమైత్రియొనర్చుట।
బలము దార్ఢ్యంబునుగలుగునట్టి।

దేహంబుననియెడుదివ్యమాసియాఘు।
గానము లేమనుజునిగూడుకొనునా।.

తే॥గీ॥ వానిదే సౌఖ్యపదవి యివ్వసుధలోన
దూరమైనట్టి యేకాంతదుర్గమైన।
స్వర్గ మనశనపథమది. నిర్గమం బ।
దేల కాల్చినా సకల మిం దేచెలంగ॥ ౮౦॥

సమాప్తము.

వేదాంత విద్యావిశారద లగు. మ. రా.
రా. పులుగుర్త నరసింహాం పంతులుగారి యు
భిప్రాయ మిట్లువ్రాయుచున్నారు.

ఆ॥ వె॥ పృథుయశోవిరాజి బెహారాన్వయుడురామ।
మూర్తిసుకవి హృద్యముగ సులువుగ।
నజ్ఞులెరుగ ప్రాజ్ఞు లలర బ్రహ్మజ్ఞాన।
దీపికను రచించె దెలుగుబాస॥

---